చల్లాలక్ష్మీనరసింహశాస్త్రి

# తిలక ఫలమంజరి

మచిలీపట్టణము, 1924

Record no. 623

## Bibliographic Record Target

చల్లాలక్ష్మీనరసింహశాస్త్రి.

తిలక ఫలమంజరి / లక్ష్మీనృసింహశాస్త్రిచే ఆంధ్రతాత్పర్యసహితముగా వ్రాయఁబడినది.- 2. ముద్రణము.- మఛిలీపట్టణము : ఆర్యానంద ముద్రాక్షరశాల, 1924.

24 p. ;18 cm.

Record no. 623

Callālakṣmīnarasiṃhaśāstri.

Tilaka phalamañjari / Lakṣmīnṛsiṃhaśāstricē Āṃdhratātparyasahitamugā vrāyam̐baḍinadi.- 2. mudraṇamu.- Machilīpaṭṭaṇamu : Āryānanda Mudrākṣaraśāla, 1924.

24 p. ;18 cm.

Record no. 623

ఓం
పరబ్రహ్మణేనమః

# తిలకఫలమంజరి.

ఇది,

చెల్లా నాగలింగశాస్త్రిలవారి పుత్త్రుఁడగు,

లక్ష్మీనృసింహశాస్త్రిచే

ఆంధ్రతాత్పర్యసహితముగా వ్రాయఁబడి.



శ్రీ ఆర్యానంద ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

ద్వితీయముద్రణము [illegible]00 ప్రతులు

రిజిస్టర్డు కాపీరైట్

1924

దీనివెల 0—2—0 పోస్టుఖర్చులుప్రత్యేకము

# పీఠిక.



ఈగ్రంథము ఎంతశ్రమజేసి వ్రాసినను కొన్నిలోపము లుండవచ్చును. అట్టిలోపములు గ్రంథము జదువువారలకుసుల భముగ దెలియును. దీనియందు గన్పట్టునట్టిలోపములను, గ్రంథమునుఁ గూర్చిదీనిని జదువువారల యభిప్రాయమును మాకు దెలియ జేసినవారలకు అనేక వందనములాచరించెదము ఆయా లోపములన్నియు మూడవకూర్పునందు సాధ్యమగు సంతవఱకు సవరణ జేయబడును. ప్రకటనలోనున్న కాలమునకు గ్రంథము ను బంపుట, అనేకమగు ఇబ్బందులు తటస్థించినందున సంభవించ లేదుగాన గ్రంథమునకు దరఖాస్తుచేసిన వారలను క్షమార్పణ వేడెదను. ఈగ్రంథము వలయు వారందరు యీ దిగువనా అడ్రసుకు వ్రాసి తెప్పించుకొనగలరు.

ఆర్యానందప్రెస్, మఛిలీపట్టణము.

ఇట్లు,
చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.

# తిలకఫలమంజరి గ్రంథప్రారంభః.

శ్లో॥ కైలాసశిఖరేరమ్యే సుఖాసీనంమహేశ్వరం। ప్రణమ్యపార్వతీభక్త్యా ప్రత్యువాచసదాశివమ్॥

పార్వత్యువాచ ॥ శ్లో ॥ దేవదేవజగన్నాథ భక్తానుగ్రహకారక। లోకోపకారకంప్రశ్నం వదమేపరమేశ్వర॥ తిలకానాం స్వరూపంచ ఫలాఫలనిరూపణం।తత్సర్వంవదమేస్వామిన్ సర్వజ్ఞోసియతోమమ। ఏతచ్ఛ్రుత్వావచోదేవ్యాః ప్రీతిమాన్ సమహేశ్వరః॥ ప్రహస్యజగతామీశో వల్లభాం ప్రీతిసంయుతామ్। ఉవాచప్రశ్నంతింగూఢం త్రైలోక్యేచాపిదుర్లభమ్।

అథాతస్తిలకం వ్యాఖ్యాస్యామః॥

తా॥ పుట్టుమచ్చలవలన శుభాశుభఫలములను వివరించుచున్నాను.

శంఖేర్ధ గారవే।

తా॥ కణతియందు బుట్టుమచ్చయుండెనేని ఆకస్మికధన ప్రాప్తియు, ఖ్యాతియుకలుగును.

పార్శ్వేచ॥

తా॥ కుడికణతిపైని మచ్చయుండెనేని మొదటిసూత్ర ఫలమునే జెప్పవలయును.

భృవాంధనగుణశ్రీ పత్న్యశ్చిరవివాహశ్చ।

తా॥ కుడికను బొమ్మయందు బుట్టుమచ్చయుండెనేని శీఘ్రముగా వివాహముజరుగును. భార్యసుగుణవతియు ధనవతి యుగానుండును.

వామయోర్బగ్నేహా॥

తా॥ పైజెప్పిన కణతకనుబొమ్మవీనియందు ఎడమ పార్శ్వమున బుట్టుమచ్చయుండిన నిశ్చిత ఫలకార్య ములయందు భంగము కలుగును.

అపాంగయోస్సామ్యతా బలాన్మరణమ్॥

తా॥ కంటియొక్క కొనలయందు బుట్టుమచ్చ యుండెనేని శాంతముద్ధతచిత్తము బలాత్కారమరణము గలుగును.

గండయోర్మధ్యమైశ్వర్యమ్॥

తా॥ చెక్కిళ్ళయందు మచ్చయుండెనేని స్వల్పధనము గలవాడగును.

నాసికాయాం కార్యసాఫల్యమ్॥

తా॥ స్త్రీపురుషులకెవరికైనను నాసికయందు మచ్చ యుండెనేని తలచినకార్యములన్నియు సఫలమునొందును.

ఓష్ఠయోర్నాగరికతా కామశ్చ॥

తా॥ స్త్రీలకు గాని, పురుషులకు గాని, మీది పెదవియందైనను, క్రింది పెదవియందైనను, మచ్చయుండెనేని మంచి వస్తువులం దనురక్తియు, కామభోగములయందు చతురతయు సఫలతయు గలుగును.

చుబుకేవిత్తవిఖ్యాతీ॥

తా॥ గడ్డమందు మచ్చయుండెనేని ధనాభ్యుదయము లును, గౌరవాతిశయమును గలుగును.

కంఠపార్శ్వే శ్వాసనిరోధోజ్ఞాతేర్ధనాగమః
ప్రఖ్యాతిశ్చ॥



తా॥ కంఠపార్శ్వమునందు మచ్చ యుండెనేని శ్వాస నిర్బంధము. జ్ఞాతివలన ద్రవ్యప్రాప్తియు, సిద్ధియు కలుగును.

గళేవివాహార్ధనమ్॥

తా॥ కుత్తుకయందుమచ్చయుండిన వివాహమూలకము గధనము సంభవించును.

కుచేసుఖాద్భ్రంశః స్త్రీప్రజా॥

తా॥ దక్షిణకుచమునందు మచ్చయుండెనేని అనూహ్యములగుకష్టములచే సుఖమునుండి తొలగును స్త్రీ సంతానము గలవాడగును.

వామేకార్యజయః స్త్రీలోలతాచ॥

తా॥ వామకుచమునందు మచ్చయుండెనేని కార్యజయమును, స్త్రీలోల్యమును గలిగియుండును.

ఉరసిభాగ్యారోగ్యయోర్మధ్యస్థితిః॥

తా॥ వక్షస్థలమునందు బుట్టుమచ్చయుండెనేని నిధన సౌఖ్యములయందు మధ్యమస్థితి నొందును.

వామకుచాదస్తాత్త్వరితశీలం ఆదృఢచిత్తంచ॥

తా॥ వామకుచమునకు క్రిందుగ గుండెకు మీదుగ మచ్చయుండెనేని ముంగోపియు చంచలచిత్తుడును, దేశ సంచారియు అసత్యవివక్తుడును అగును.

స్త్రియాశ్చేదచిర ప్రజాదిస్సుస్నేహః॥

తా॥ ఇట్లుస్త్రీకియుండెనేని శీఘ్రసంతతియు ప్రసవసౌఖ్యమును స్నేహసద్భావములును గలిగినదగును.

పార్శ్వేల్పమనః॥

తా॥ కుడిప్రక్కను ప్రక్కయెముకల పైనియు మచ్చ

యుండెనేని అల్పమనస్సుగలవాడును కష్టసాధ్యములగు సంగతులను దెలిసికొనుటలో మందుడును అగును.

ఉదరేమాంద్య ముదరంభరితా॥

తా॥ ఉదరమునందు మచ్చయుండెనేని మాంద్యమును తిండిబోతుతనమును అన్నిటియందు దురాశయును, మలినవస్త్రములు గట్టుటయును గలిగియుండును.

అంకేఐశ్వర్యంవివాహశ్చ॥

తా॥ కుడితొడయందు మచ్చయుండెనేని సంపద గలుగును. వివాహమువలనఁగూడ ధనముగలుగును.

వామేపీడా॥

తా॥ ఎడమతొడయందు మచ్చయుండెనేని దరిద్రము చేబీడితుఁడై స్నేహితులులేక శత్రువులయొక్క అన్యాయముచే బాధింపఁబడును.

జానునీజాయా సౌఖ్యమిచ్ఛాసిద్ధిశ్చ॥

తా॥ కుడిమోకాటియందు మచ్చయుండెనేని భార్యాసౌఖ్యమును ఇచ్ఛాలాభమును గలుగును.

స్త్రీణాంయోగ్యతా॥

తా॥ స్త్రీలకు యోగ్యతనీతియుగలుగును.

వామేల్పమతిః॥

తా॥ ఎడమమోకాటియందుండిన యోచనలేనియల్పబుద్ధిగలుగును.

స్త్రీణాంబహుప్రజా॥

తా॥ ఇదియే స్త్రీలకు అధికసంతానమును గలిగించును.



జంఘాయామజ్ఞతా॥

తా॥ పిక్కలయందుండెనేని బద్ధకము యోచనలేమియు అలసటయు గలుగును.

గుల్ఫయోః స్త్రీస్వభావః స్త్రీయాశ్చేత్ధైర్యమ్॥

తా॥ చీలమండల యందలి పుట్టుమచ్చ పురుషులకు స్త్రీస్వభావమును, సువస్త్రప్రీతిని గలిగించును. స్త్రీలకుండిన ధైర్యమును, పాటుపడుటయును చురుకుదనమును గలిగించును.

పాదయోరాకస్మికమరణమ్॥

తా॥ ఏపాదమందైన పుట్టుమచ్చగలదేని ఆకస్మికవ్యాధిని ఆకస్మికముగా దురదృష్టమును కలిగించును.

వస్త్యాం దౌర్బల్యమ్॥

తా॥ పొత్తికడుపునమచ్చయుండిన బలహీనతకలుగును,

భుజేసుగుణాః॥

తా॥ కుడిభుజమునందు బుట్టుమచ్చయుండిన నేర్పువివేకము గోప్యము గలిగియుండును.

వామేకలహామూర్ఖ్యమ్॥

తా॥ ఎడమ భుజమునందుండిన కలహము మూర్ఖము గలిగియుండును.

బాహౌబలధైర్యే॥

తా॥ కుడిచేతియందు మచ్చయుండెనేని బలము, ధైర్యముగలుగును.

వామేనిశ్చయజయా॥

తా॥ ఎడమచేతియందుండిన మనోనిశ్చయము యుద్ధజయము గలుగును.

కపోలాభ్యాంచాంచల్యమ్॥

తా॥ మోచేతిసమీపమున మచ్చయుండెనేని విశ్రాంతిలేని చపలచిత్తము హితులయందతృప్తియు గలుగును.

ప్రకోష్ఠే సుఖమంతే॥

తా॥ మోచేతిక్రింద మణికట్టుకు మీదుగ కుడిఎడమ చేతులయందేదైన పుట్టుమచ్చయుండిన అధిక మయిన ధనము నొందునుగాని ప్రథమమున అనేక కష్టముల ననుభవించును.

కరభేడుద్యోగాదయః॥

తా॥ మణికట్టుక్రింద వేళ్లకొనవరకు మీచేతి యందెచ్చటనైన బుట్టుమచ్చయుండిన కృషిద్రవ్యము విశ్వాసము స్త్రీలయందాసక్తియు గలిగియుండును.

పార్శ్వయోర్ధనారోగ్యహానిః॥

తా॥ భుజమూలము మొదలు కటిపర్యంతము కుడి యెడమభాగములలో నెందైనను మచ్చయుండిన సౌఖ్యహాని ధనహానియు గలుగును.

నాసికాపార్శ్వయోస్సంచారః స్త్రీణాంనాసికేచ॥

తా॥ నాసికాపార్శ్వములయందలి మచ్చ యుండెనేని దేశసంచారముగలుగును.

హనౌ స్త్రీణాందుఃఖమ్॥

తా॥ స్త్రీలకుక్రిందిదవడయందుమచ్చయుండినఎల్లప్పుడు దుఃఖమును, శరీర బాధయు కలుగును. స్త్రీల నాసిక యందు మధ్యఫల భవంతి

లలాటోర్ధ్వక్రౌర్యమ్॥

తా॥ ముఖముపైన క్రిందుగ మచ్చయుండిన మృదుత్వము లేనివాడును క్రూరహృదయము గలవాడును అగును.



మధువర్ణాదాదృతిః రక్తాచండతా నీలాదదృఢమనః

తా॥ ఆమచ్చతేనె వర్ణముగనుండిన ఆదరింపఁబడును. ఎఱ్ఱనిదిగానుండిన కోపియగును. నల్లనిదిగానుండిన అస్థిర చిత్తముగలవాడగును.

స్త్రీణాందుర్మతిః॥

తా॥ ఆమచ్చ స్త్రీలకు ముఖముమీదనుండిన దుర్బుద్ధి ఘాతుకత్వము ద్రోహము గలుగును.

వామేకృత్యాద్దరిద్రతా॥

తా॥ ముఖమున ఎడమభాగమున మచ్చయుండిన తన దుర్నడత వలన దారిద్ర్యము నొందును.

మధురక్తాభ్యాంకించిత్సుఖమ్॥

తా॥ ఆమచ్చమధువర్ణముగయుండినవానికిదుఃఖములుపశమించియుండును.కొంచెముసుఖమునుగలిగియుండును.

నీలాద్వ్యగ్నయత్నతః॥

తా॥ ఆమచ్చనల్లనిదగునేని ప్రయత్నములు విఫలములగును.

మధ్యేధనమ్॥

తా॥ నుదుటి దక్షిణభాగమున మధ్యమునందు మచ్చయుండిన మహాదాశ్రయమువలన ధనముగలుగును, గౌరవము తుడును. ఆజ్ఞాకర్తయునగును ఆమచ్చ ఎఱ్ఱనిదయ్యెనేని గురువులవలన ఆదరింపఁబడును. నల్లనిదయ్యెనేని పెద్దలఆగ్రహము వలన భయపడవలసిన వాడగును. ఇది స్త్రీకిగలిగెనేని భాగ్యవతియునగునుగాని మచ్చనల్లనిదైన యెడల గయ్యాళి యగును.

వామే యజమానాద్భీతిః॥

తా॥ ముఖమున కెడమ ప్రక్క నట్టనడుమ ఆ మచ్చ యుండిన యజమానులవలనభయముగలుగును. అది తేనెవర్ణము గలదేనినుండినఆ స్త్రీనిదుర్వ్రియను చేయును. రక్తవర్ణ గలదేనిదరిద్రుడగును. నల్లనిదగునేని పెద్దకోపమునకు పాత్రుడగును. ఇది స్త్రీకి గలిగిన దుర్మార్గులదుష్టచర్య వలనదుఃఖమును బొందును. మచ్చనల్లనిదగునేని మిక్కిలిదారిద్ర్యమునొందును.

పార్శ్వోర్ధ్వేరక్తాచ్చాతుర్యమ్॥

తా॥ నుదుటియెడమ వైపునకణతకు కొంచెము మీదనుయెఱ్ఱమచ్చయుండెనేని శ్రేష్ఠమైన అవగాహనశక్తియు బుద్ధిచాతుర్యమును గలిగియుండును.

నీలాన్నింద్యతా॥

తా॥ అచ్చోట నల్లనిమచ్చయుండిన అబద్ధము లాడి చీవాట్లుతినును. ఇదియే స్త్రీలకు యెఱ్ఱమచ్చగా నుండిన దోషరహితులగుదురు. నల్లనిదగునేని దుష్టసహవాసము గలుగును.

నేత్రోపరిసౌభాగ్యందీర్ఘాయుః॥

తా॥ కుడికణతపైని కంటిమీదుగ తలకుసమీపమున మచ్చయుండెనేని సౌభాగ్యమును దీర్ఘాయువును గలుగును.

రక్తపాండురాభ్యామ్॥

తా॥ ఆమచ్చ రక్తవర్ణముగ గాని, పాండువర్ణముగ గాని, యుండిన కృషీవరుడగును. స్త్రీకి అట్లుండెనేని మంచిదియు సుగుణురాలును జాగ్రత్తయైన నడతగలదియు నగును.

కర్ణోపాంతేచ॥

తా॥ కుడిభాగముగ చెవికిసమీపమున ఎచ్చటనైనను,



మచ్చయుండెనేని పైసూత్రఫలమునే చెప్పతగినది.

వామనేత్రోపరిరోగః

తా॥ ఎడమకంటికి మీదిభాగమున మచ్చయుండెనేని రోగముగలుగును. అదినల్లనిదగునేని అల్పాయువు. మఱియు అదియే స్త్రీకుండిన యెడల మితసౌఖ్యము స్నేహితుల దయాలోపము బిడ్డలుయెదిరించుట దారిద్ర్యముగలదగును.

కర్ణేధనగౌరవే॥

తా॥ చెవి యందలి మచ్చధనగౌరవములనిచ్చును.

హస్తేభ్యుదయః॥

తా॥ స్త్రీపురుషుల కెవరికైనను పాణితలమున మచ్చయుండెనేని ఐశ్వర్యాభివృద్ధియుసంతానసౌఖ్యమును గలుగును.

వామాంసేకలహః॥

తా॥ ఎడమ భుజము మీద మచ్చయుండెనేన కలహముగలుగును.

దక్షిణకర్ణాంతే జలాన్మృతిః॥

తా॥ కుడిచెవుక్రిందికొననుమచ్చయుండెనేని జలగండం

కుక్షేర్వామేదుఃఖమ్॥

తా॥ కడుపునకుయెడమపార్శ్వమునందలి మచ్చయుండెనేని దుఃఖావహము.

దక్షిణపాదేసుబుద్ధిః॥

తా॥ కుడికాలున మచ్చయుండిన మంచిబుద్ధిగలుగును.

వామేఽపవ్రివా॥

తా॥ వామపాదమునందుండెనేని అపాయకరమైనక్రూరకృత్యములను జేయుచు.

వామకక్షే కాలమరణమ్॥

తా॥ ఎడమచంకలో మచ్చయుండిన అకాలమరణము సంభవించును.

కంఠోభయపార్శ్వయోః ప్రాణకష్టమ్॥

తా॥ కంఠమునకిరుపార్శ్వములయందెందైన నుండెనేని ప్రాణకష్టము.

వక్షసిసలోమాతృకవితా॥

తా॥ వక్షస్థలమధ్యమునసల్లని వెంట్రుకలతో మచ్చయుండెనేని కవిత్వముగలుగును.

నేత్రేకోపః॥

తా॥ కుడికంటి క్రింది కల్లములోని మచ్చవలన కోపవంతుడగును.

చుబుకపార్శ్వేసుగుణాదయః

తా॥ గడ్డముప్రక్కను పుట్టుమచ్చయుండెనేని శాంతము సుఖజీవనము స్నేహబాహుళ్యము గలిగియుండును మఱికొన్నివిషయములు నిరూపించెదను.

## సుళ్ళయొక్క ఫలము.

(కొద్దిగా వ్రాయబడును)

శ్లో॥ కట్యావర్తా సేవకీస్త్రీకంఠావర్తాతునిష్ప్రజా। ఫాలవర్తావవిధవాజారిణీ కలహప్రియా॥

తా॥ స్త్రీలకు పిరుదుమీద సుడియుంటే పరగృహములో చాకిరీచేసును. కంఠమునందు సుడియుంటే సంతానములేదు. ముఖమునందుసుడియుంటే విధవయగునుఅంగరాసులు ఎట్లనిన,



## మఱికొన్నివిషయములు.

కించ॥ కంటిమీదను సుడియున్న కాంతపరదారిజతలంబులమీద నిశ్చలతనొందు వనిత కునిటలంతమున సుడి యున్న విధవయై జారియై వెవహరించు సుడియున్న కాంతకు పుడమి సంతతిలేదు॥ (అర్థము స్పష్టము.)

శ్లో॥ కనిష్ఠికాగుళిః పాదే గచ్ఛంత్యానస్పృశేద్భువం। నిమ్నంపాదతలంజారా నిశ్శబ్దంభవతిధ్రువమ్॥

తా॥ స్త్రీనడిచేకాలమునందు నిశ్శబ్దముగా నున్న అరకాలు పూర్ణముగా భూమికి తగలకనే వుండినయడల జారిణియగును.

శ్లో॥ అథవావిధవాభూయాత్సుఖం తస్యానవిద్యతే। పాదతాడనతోభూమిం చాలయంత్యపిఖిద్యతి॥

తా॥ మఱిన్ని ఆలాటి స్త్రీ వైధవ్యమునుపొందును భూమిఅదిరేలాగన నడిచెటిస్త్రీ అయితే దరిద్రునికి భార్యయై దుఃఖించును.

శ్లో॥ సరోమోత్తుంగజంఘాచ ఫాలోత్తానాదిమూర్ధజా। భుజోరుకేశయుక్తాచ వస్త్రావర్తాపతింహరేత్॥

తా॥ మోకాలు కింది జంఘలురోమ యుక్తము లయి పొడుగైతే తొడలయందు భుజములయందు రోమములు మొలచితే ముంభాగమందు తలలోసుడి వుండి రోములువత్తుగా నుండెనేని ఆలాటిది తప్పక విధవయగును.

శ్లో॥ అత్యంతనీలకేశాచ శుష్కశ్రోణీచదాస్యకాం। వికటాంగుళిరాప్నోతి వైధవ్యంచప్యపుత్రతామ్॥

తా॥ అతినీలమైన వెంట్రుకలు కృశమైన అంగములు

కలిగినది దాసియగును. వక్రమైన చెయ్యి కాలివేళ్ళు గల స్త్రీయు గొడ్డురాలు విధవయుఅగును

శ్లో॥ లంబాలకామహామస్తా పృథుమధ్యామహోదరీ। వామావర్తాచవైధవ్యం దారిద్ర్యందుఃఖమాప్నుయాత్॥

తా॥ గొప్పయగుతలయు వ్రేలెడిముంగురులు దప్పమైన నడుము గొప్ప కడుపుగలది వైధవ్యమున్ను దరిద్రము నుచెందును.

శ్లో॥ విశాలభగపాలాచ భర్తారంతత్కులంతథా. అవమన్యేతదుర్బుద్ధిః స్థూలదంతాతునిర్ధనా॥

తా॥ భగము ముఖము విశాలమైనది పతినిన్ని పతి యింటివారినిన్ని అవమానపరుచును, దుర్బుద్ధి కలది పండ్లుదప్పమైతే దరిద్రరాలగును.

శ్లో॥ కట్యావర్తాసేవకస్త్రీ కంఠావర్తాతునిష్ప్రజా। ఫాలావర్తావవిధవాజారిణీకలహాప్రియా॥

తా॥ పిర్రమీద సుడియుంటె పరగృహములో చాకిరీ చేసుచు కంఠమునందు సుడియుంటెసంతానము లేదు ముఖమునందుసుడియుంటె విధవ యగును.

శ్లో॥ ఓష్ఠచూచుకగండేషు కర్ణయోర్భుజయోరపి। లోమానినప్రకాశంతే సానారీభోగభాగినీ॥

తా॥ గడ్డము మీసము భుజముల యందున్ను చెవుల యందున్ను వెండ్రుకలు కొంచెమైనా కనుపించేలాగున లేని యెడల ఆలాటిది బహుసౌఖ్యపడుచున్నది.

శ్లో॥ పుతకేశాపతింద్వేష్టి నాభిలోమాచజారసుః। లబసనీమృతాపత్యావిసుఖాభగకేశినీ।



తా। అడ్డవెంట్రుకలు కలిగినది పతిని ద్వేషించును బొగ్గిలియందు రోమములు గలది పంగటించుకుని వ్రేరాడు స్తనములుగల యీలాటిదానికి సంతానము బ్రతికేది లేదు భగకేశములుగలది సుఖము లేంది. కడమవిషయములు ముందు ముందుచూడగలరు.

తిలకఫలమంజరి సమాప్తము.



—(అథగ్రహాణాంస్వక్షేత్రాదివిచారః)—

ఆ ధ ర వేః

శ్లో॥ ఉచ్ఛస్థానంరవేర్మేషం వృషభంతుద్విషద్గృహం। మిథునంతుసమక్షేత్రం మిత్రక్షేత్రంకుళీరకం॥ స్వక్షేత్రం మూలకోణంచ సింహః ప్రోక్తస్తుసూరిభిః। కన్యాభంతుసమక్షేత్రం తులానీచారిమందిరం। మిత్రక్షేత్రేకీటధనుషీమకరంస్యాద్విషద్గృహం। కుంభోపిశత్రుక్షేత్రంచమిత్రక్షేత్రంతుమీనభం। రవేర్గ్రహాణాం గణనాత్వేసంప్రోక్తావసూరిభిః॥

—(అ థ చ ం ద్ర స్య)—,

శ్లో॥ వి ధో ర జా స మ క్షే త్ర ము చ్ఛ స్థా న ం వృష స్తథా। మూలకోణంతథాప్రోక్తం మిత్రక్షేత్రంతుయుగ్మభం॥ కర్కటంతుస్వభవనం మిత్రక్షేత్రంతుసింహభం॥ కన్యామిత్రస్య భవనంతులాసమగృహంభవేత్॥ వృశ్చికంతు సమక్షేత్రంనీచరాశిరపిస్మృతా। శరాసనంసమగృహం మకరస్సమగృహంభవేత్। కుంభర్క్షంతు సమక్షేత్రం మీనంస్యాత్సమమందిరం।

విధోర్గ్రహాణాంగణనా త్వేవంప్రోక్తాచసూరిభిః॥

—(అథ కుజస్య)—

శ్లో॥ కుజస్యమేషంస్వక్షేత్రం మూలకోణంతథైవచ। వృషభంశత్రుభవనం మిథునంత్వరిమందిరం ॥ కర్కటం నీచరాశిశ్చ మిత్రక్షేత్రముదాహృతమ్ । సింహర్క్షంమిత్రభవనం కన్యాశత్రుగృహంభవేత్॥ తులాశత్రుగృహంప్రోక్తం వృశ్చికంస్వగృహం భవేత్ । ధనుర్మిత్రగృహంప్రోక్తం మకరంశత్రుమందిరం॥ మకరంచోచ్చరాశిస్స్యాత్కుంభం శత్రుగృహంభవేత్ । మీనంతుమిత్రక్షేత్రంస్యాత్కుజస్యైవంవదంతిహి॥

—(అథ బుధస్య)—

శ్లో॥ బుధస్యాజాసమక్షేత్రం వృషమిత్రగృహంభవేత్ మిథునంస్వగృహంప్రోక్తం కర్కటంతుద్విషద్గృహం॥ సింహర్క్షం మిత్రభవనంకన్యాస్వక్షేత్రముచ్యతే। మూలకోణంతూచ్చరాశిః కన్యాసౌమస్యయోగదా॥ తులామిత్రగృహంప్రోక్తం వృశ్చికం సమమందిరం। ధనుర్మృగౌసమక్షేత్రేకుంభర్క్షంసమమందిరం॥ మీనంసమగృహంప్రోక్తం నీచరాశిస్తదాభవేత్। బుధస్యాగారగణనా త్వేవంప్రోక్తాతుసూరిభిః॥

—(అథ గురోః)—

శ్లో॥ గురోర్మేషంమిత్రగృహం వృషభంత్వరిమందిరం । మిథునం శత్రుభవన ముచ్చస్థానంతుకర్కటం॥ తదేవమిత్రభవనం సింహభంమిత్రమందిరం।కన్యాతులేశత్రుగృహేవృశ్చికంమిత్రమందిరం ధనుస్థానంమూలకోణంస్వక్షేత్రంచాభిధీయతే। మకరంనీచరాశిస్యాత్సమక్షేత్రముదాహృతం॥ కుంభరాశిస్సమక్షేత్రం మీనంస్వభవనంభవేత్ ।గురోర్గ్రహాణాంగణనా త్వేవంప్రోక్తాతుసూరిభిః॥



—(అథ శుక్రస్య)—

శ్లో॥ భృగోర్మేషంసమక్షేత్రం వృషభంస్వస్యమందిరం। మిథునంమిత్రభవనంకర్కటంత్వరిమందిరం॥సింహర్క్షంశత్రుభవనం కన్యానీచాసుహృద్గృహం । స్వక్షేత్రంమూలకోణంచ తులాప్రోక్తాభృగోస్తథా॥ వృశ్చికంతుసమక్షేత్రం ధనుస్త్వరిగృహంభవేత్। మకరంమిత్రభవనం కుంభస్తుసుహృదోగృహం॥ మీనర్క్షంతూచ్చరాశిస్స్యాచ్ఛత్రుక్షేత్రంతథైవచ। భృగోర్గ్రహాణాంగణనా త్వేవం ప్రోక్తాచసూరిభిః॥

—(అథ శనేః)—

శ్లో॥ శనేర్మేషోనీచరాశిశ్శత్రుక్షేత్రముదాహృతం।వృషభంమిథునంచైవమిత్రక్షేత్రముదాహృతం॥ కర్కటంశత్రుభవనంసింహర్క్షంశత్రుమందిరం।కన్యామిత్రగృహంతౌలీతూచ్చరాశిస్సుహృద్గృహం॥ వృశ్చికంశత్రుభవనం ధనుస్సమగృహంభవేత్ । మకరంస్వభవనం కుంభస్స్వాగారం మూలకోణకం॥ మీనర్క్షంతు సమక్షేత్రమిత్యేవంగృహనిర్ణయః॥

—(అథ రాహోః)—

శ్లో॥ వృషసింహౌతూచ్చరాశీ రాహోః ప్రోక్తేతుసూరిభిః । మిథునంకర్కటంచైవ మూలకోణమితిస్మృతం॥ మేషభం మిత్రభవనంకన్యాస్వభవనంభవేత్ । ఉచ్చస్థానస్థరాహోస్తుదాయకాలోహిరాజ్యదః॥

—(అథ కేతోః)—

శ్లో॥ కేతోస్స్వభవనంమీనం తులామిత్రస్యమందిరం। కుంభకీటౌతుంగరాశీ మూలకోణేధనుర్మృగౌ॥

సమాప్తము.

# జన్మరాశిఫలమ్.

ప్రాచీనఫలగ్రంథే॥ శ్లో॥ అశ్వినిభరణికృత్తికాః పాదం మేషం - అధిపః కుజః॥ ఈ రాశియందు జన్మించినవానికి చేతులు పొడుగు, రక్తచ్ఛాయగలవారు, ముఖము వెడల్పుగనుండును. జ్ఞానపురుషుడు, కోపస్వభావముగలవాడు, సత్యవంతుడు, పనులయందు నేర్పరి, కోపమునకు భయపడనివాడు, యోచనపరుడు, తూర్పుకునడుచువాడు, కొంచముపొట్టివాడు, పైత్యవికారముగలవాడు, స్త్రీలయందుప్రియుడు, మేకజంతువునందుప్రియముగలవాడు, వీనికి ౫ మాసమందు పిశాచపీడ, ౫ సంవత్సరంబున గండభయము, ౬ సం॥ అగ్నిబాధ, ౪ సం॥ పరపీడ, ౧౨ సంవత్సరంబున శరీరతాపము, ఈపీడలు తనపూర్వ సుకృతవిశేషము వలనపరిహారమగును. ౭౬ సంవత్సరములు ఆయుష్యముగలదు బాలగ్రహ దోషములు పరిహారము కావలెను.

చైత్రశుక్ల ౧౦ లరోజునమృత్యుభయము సంభవించును. మేకదానము, వస్త్రదానము, కందులు, బెల్లము, రాగిచెంబు, జలము, పాలు, పెరుగు, రాత్రిపూటదానముచేయుము. ఆయురంతవరకునిట్లుచేయుము. బుధుడుబలవంతుడుగా నుండవలెను. ఉదయలగ్నంబున సూర్యుడుండిన ఉష్ణశరీరి, గురువుండినచో ప్రభుత్వముగలవాడు, శుక్రుడుండిన కోపవంతుడు, అదృష్టవంతుడు, శనివలన శరీరపీడలు సంభవించును. కేంద్రములయందు శుభగ్రహములుండిన, నిండాఅదృష్టశాలి. పత్నీపుత్రాదిసుఖవంతుడగును. ఇదిగర్గవాక్యము నిశ్చయము.



శ్లో॥ కృత్తికాత్రయఃరోహిణి మృగశిరార్ధంవృషభమ్॥ ఈరాశ్యాధిపతి శుక్రుడు, ఇందు జన్మించినవాడుకాళ్ళు, చేతులు సత్తువగలవాడు, పాడిపంటలు అనుభవించువాడు, స్త్రీలయందు ప్రేమగలవాడు, ప్రియభాషి, శ్వేతవస్త్రములయందును,ధనార్జనయందును అత్యంతప్రియుడు,తూర్పుదక్షిణదిక్కులకుపోవువాడు, వృషభమందుభక్తిగలవాడు, బంధుపోషకుడు, భార్యాపుత్రులయందు సామాన్యము దృష్టిగలవాడు, ౫ - మాసం॥ ౫ రోజు॥ దోషముగలది. ౫-౧౧ సంవత్సరములందు ఆయుధగండము, 30 సంవత్సరంబున శరీరపీడ, మధ్య మధ్య బలహీనము, శనిప్రీతిచేస్తూరావలెను. దేవతలకు మొక్కులుచెల్లించుచుండవలెను. ఆయుష్యం ౭౦ సంవత్సరములు వఱకు గలదు మధ్యమధ్య పరకృతపీడలు సంభవించును, మార్గశిర శు ౧౮ గురువారము మధ్యాహ్నము ౧౨ ఘంటలకు మృత్యుదేవతదగ్గరకుగాబడును. వీనికి మెడయందుగాని, తొడయందుగాని, శరీరంబున పుట్టుమచ్చ పుట్టివుండును. ఉదయరాశియందుసూర్యుడుండినా, విద్యావంతుడు, ధనవంతుడు, కుటుంబవంతుడగును. చంద్రుడుండినా, ప్రభుత్వముగలవాడు. బుధుడుండినా, ధనము సంపాదించనివాడు, కుజుడుభూసంపాదకుడుకు, శుక్రుని వలన నేత్రదృష్టిగలవాడైనను, పూర్వ శాపమువలన నేత్రజబ్బుగలవాడగును. శనివలన, నల్లనివర్ణముగల శరీరచ్ఛాయ, ఉపకారి వాత్ర కోపవంతుడు, సర్పప్రతిష్ఠ తప్పక చేయవలెను. పూర్వదోషములుపోయి సుఖవంతుడగునని గర్గమహాముని శిష్యులకు జెప్పెను. నిశ్చయము.

శ్లో॥ మృగశిరార్ధంఆర్ద్రపునర్వసు త్రయోర్మిథునమ్॥

ఈరాశ్యాధిపతి బుధుడు, యీజాతకుడు కలహకారి, చేతియం
దుగాని, పార్శ్వమునగాని, పుట్టుమచ్చగలవాడు, స్త్రీతో సర్వ
దాముచ్చటలాడును. చక్కనిశరీరముగలవాడు, ముక్కుపొడు
గు, యాత్రాపరుడు, వర్తకస్వభావి, సామాన్యవిద్యగలవాడు,
తల్లితండ్రులను పోషించుచు వకప్పుడు దుఃఖము కలుగజేయు
వాడు, శతృవిరోధి, వీనికి 3-౫ సంవత్సరములలో దోషము
లుండును, మృత్యుదేవతవచ్చిపోతూవుండును, దంపతులకు ప్రి
యముచేయువాడు, ౪౨ సంవత్సరంబున మృత్యుభయము కల
దు కార్తిక బ ౧ మంగళశనివారములలో మృత్యుదేవతాధీన
ములోనుండును, జన్మంబున శనివలన దరిద్రత్వము, రవివలన,
బలవంతుడు, గురువువలన ధనసంపత్తులు గలవాడు, చంద్రుని
వలన, రాజ్యపూజ్యతగలవాడు, అంగారకునివలన, తేజస్సుగల
వాడు, పూర్వశాపమువలన, చాలాభాగము కష్టపడువాడుగాన,
పరులకువివాహములు చేయుచుండవలె, పెద్దలాశీర్వచనసామ
ర్థ్యంబున బలవంతుడగును, గర్గమహాముని తనప్రియశిష్యునకు
చెప్పినమూడవ వాక్యము.

శ్లో॥ పునర్వసూఃపాదంపుష్యమిఆశ్లేషాంత్యంకర్కాటకమ్ ॥

యిందుకు అధిపతి చంద్రుడు, యిందు జన్మించిన వాడు, శుచి
గలవాడు, మంచిజ్ఞానము గలవాడు, మర్మము తెలియనివాడు,
యుక్తాయుక్తమందు పూర్ణనేర్పరిగానుండి మధ్య భయపడువా
డు, స్త్రీలయందుసర్వదాభక్తిగలవాడు, తెల్లని ఆవుపాలయం
దుమిక్కిలిప్రియుడు, తల్లిదండ్రులను సుఖపెట్టువాడు, ఇతరు
లకుపోషించువాడు, భుజముపొడుగునదుముకొంచెముసన్నము,
తల వెండ్రుకలు త్వరలో నెరిసి యుండు వాడు. గడ్డమందు



లేక ఇతరచోట్లమచ్చగలవాడు, 3 వర్షంబున చతుష్పాత్ జంతు
భయము, ౫ సం॥ సర్పగండము, ౬ నీళ్ళగండము, ౮ సం॥ పర
పీడభయము, ౪౦ సం॥ వఱకు సుఖకష్టములుగా నుండును,
పిన్నటసుఖముగలవాడు, ఆయుః ౫౦ వర్షములుగలవాడు, పు
ష్య శుద్ధ సోమవారంఆశ్లేషానక్షత్రము ఉదయం ౭ గడియలకు
మృత్యుదేవతాధీనము. జన్మంబున శని వుండినచో, నిందావ్యవ
హారి, రవియుండినా జోగి, చంద్రుడుండినా కష్టసుఖము సమ
ముగానుండువాడు, శుక్రుడుండినా, మహోపకారి, గురువుం
డినా, బుద్ధిశాలి, పూర్వకర్మదోషము చే, జంతువధ చేసిన దోష
మువలన నిందాకష్టముగిలిగి పరిహారమగును. ఇదిగర్గమహాముని
ప్రియశిష్యునకుపదేశించిన ౪ పాఠము.

శ్లో॥ మఖపుబ్బఉత్తరాః పాదంసింహమ్।

యిందుకు సూర్యుడుఅధిపతి, పితృకారకుడు, ఉష్ణశరీరి. యిందు
జన్మించినవానికి ఉదరం వెడల్పు, నేత్రములుయెరుపు, దేశాధిపతి
బహునేర్పరి, పితృమాతృవులయందుభయముగలవాడు, దేహం
బున మచ్చగలవాడు, ౫ సం॥ జంతుభయము, ౧౨ సంవత్స
రంబున పిశాచ పీడ, ౫౦ సంవత్సరంబున, ఆయుధ గండము,
ఇవిగడచినపక్షంబున, ౭౦ వర్షములుజీవించును, శ్రావణబహుళ
౧3 శుక్రవారం ఆశ్లేషయందు మరణముకలుగును. రాశియం
దు శుక్రుడుండిన, రాజు, శనివలన ధనము, సూర్యునివలన ద్రి
వ్యలోపము, కుజునివలన పరపీడలు, బుధునివలన విద్యాభంగ
ము, గురువువలన ధైర్యసాహసము గలవాడు, పూర్వంబున చే
సిన బ్రాహ్మణ తిరస్కార గురు తిరస్కార దోషములు వలన
చిక్కులుకలుగుచున్నవి. అందుకుఅన్నదానము చేస్తూవుండిన,

ఉత్తరజన్మలో మహాభాగ్యవంతు డగుచున్నాడు. నిశ్చయము. ఇది ౯ పాఠము.

శ్లో॥ ఉత్తరాత్త్రయఃహ స్తచిత్తార్థంకన్యా॥

యిందుకధిపతిబుధుడు, దేహపటుత్వముగలవాడుగాజన్మించును. విద్యగలవాడు, గోరక్షకుడు, బ్రాహ్మణతిరస్కారముగలవాడు, ౬ సం॥ అగ్నిగండము. ౩౦ సం॥ తేలుకాటు, అన్నియు తప్పినచో, ౨౯ సం॥ జీవించును, ఆషాఢ శు॥ ౭ శనివారం మరణ దేవతాధీనం, ౧ గురువుండినా రోగి, రవియుండిన ధనపతి, చంద్రుడుండినా స్త్రీవర్తి, కుజుడుండినా వ్యవహారి, శుక్రుడుండినా ధనధాన్యవంతుడు, బుధుడుండినా నేత్రరోగి, శని బహుజన సంభాషి, పూర్వంబునపరస్త్రీ సంగమముచేసిన వాడు, అందువలనకష్టము ననుభవించువాడుగా పుట్టెను.

శ్లో॥ చిత్రార్థంస్వాతి విశాఖాత్త్రయస్తులా॥

అధిపతి శుక్రుడు. మంచి రూపముగలవాడు, మచ్చగలవాడు, ౯ సం॥ ఆయుధగండం, ౭౦ సం॥ అతిసారం, ౪౦ సం॥ అగ్ని గండం, ౯౦ సం॥ నీళ్ళగండం, అన్నియుతప్పిన ౮౦ సం॥జీవించును. ఆషాఢ శు ౮ సోమవారం మృత్యుదేవతాధీనం, ఇందు శనియుండిన విద్యగలవాడు, బృహస్పతియుండినచో ప్రభువు, శుక్రుడు స్వక్షేత్రసుఖమువలన నానావిధసౌకర్యవంతుడగును లక్ష్మీపూజా తప్పక చేస్తూరావలెను.

శ్లో॥ విశాఖపాదంఅనూరాధా జ్యేష్ఠాంత్యంవృశ్చికమ్॥

అధిపతి కుజుడు, మోడకురచన, సౌమ్యుడు, వెంట్రుకలు పలచన, బహుమాటలప్రియుడు, ధనసంపాదకుడు, శుచివంతుడు ముక్కునందు రుగ్మతగలవాడు, సంభోగమందునేర్పరి, ౭ సం॥



పీడ, ౯ సం॥ అగ్నిభీతి, ౩౦ సం॥ వృక్ష గండం, పరకృత పీడ, అన్నియుతప్పినచో, ౮౦ సం॥ ఆయుర్దాయముగలవాడు మాఖ బ ౬ లు మృతిసంభవించును. రాశియందుశనియుండిన గుడ్డివాడు, రవియుండిన వ్యవహారి, చంద్రుడుండిన శ్లేష్మవ్యాధి కుజునివలన స్థిరజీవనం, గురువువలన దేశసంచారి, శుక్రుని వలన స్త్రీచింతగలవాడు, పూర్వంబున చీమలను చంపినవాడు అందువలన ఈజన్మలో బాల్యమున కష్టములు మెండుగా నుండును ఉత్తరజన్మంబున పూర్వసుకృతము చేత జ్ఞానపరుడు, భగవద్విచారపరుడగును. నిశ్చయము.

శ్లో॥ మూలపూర్వాషాఢఉత్తరాషాఢాః పాదంధనస్సు

యిందుకు అధిపతి బృహస్పతి, దురాలోచన వంతుడు, రూపవంతుడు, తొందర గలవాడు, వీనికి ౭ సం॥ వ్యాధి, ౯ సం॥ దేహపీడ, ౮ సం॥ ప్రవృత్తి, (విరోచనములు) గండం, ఇవి తప్పిన ౯౭ సం॥ ఆయుర్దాయము, ఆషాఢ శు ౯ శుక్రవారం మృత్యుదేవతాధీనము, శని దారిద్ర్యము, రవికుజులువలన ఇతరులకు మేలుచేయువాడు, వా నప్రియుడు, గురువువలన తపస్సు శుక్రునివలన పండితుడు, బుధునివలన సూక్ష్మబుద్ధియును, చంద్రునివలన స్త్రీస్వాధీనవర్తి, పూర్వంబున పుణ్యవంతుడుగాన, ఈజన్మలోమహా ఫలములననుభవించు చుండును.

శ్లో॥ ఉత్తరాషాఢాత్త్రయః శ్రవణధనిష్ఠార్ధంమకరమ్॥

అధిపతి శని, జన్మించినవాడు శుచిగలవాడు, పితృమాతృభక్తిపరుడు, క్రూరకార్యములుచేయువాడు, చంచలస్వభావి, ౮ సం॥ పులిగండము, ౧౬ జ్వరగండము, ౩౭ ఆయుధగండము, అన్నియుతప్పినచో, ౨౨ సం॥ ఆయుర్దాయము. పుష్య శు ౧౦

సోమవారము, పరలోకగమనము, శనిబుధులుండిన దారిద్ర్యం, చంద్రునివలన వ్యాధి, గురువువలన తపస్సు, శుక్రుడుండిన ధనపతిఅగును. దేవభక్తివలన పుణ్యకార్యములు చేయువాడు మహాపుణ్యశాలియగును.

శ్లో॥ ధనిష్ఠార్ధంశతభిష పూర్వాభాద్రత్రయఃకుంభమ్॥ అధిపతిశని, పలచని పాదాలు, శరీరంబున మచ్చ, వీపువెడల్పు, పొడుగుగలవాడు, దేవబ్రాహ్మణభక్తి, రూపసి, కఠినభాషి, ౫ సం॥ వ్యాధి, ౧౫ తలనొప్పి, ౩౦ బంధుపీడ, ౫౦ సం॥ పరివృత్తిపీడ, అన్నియుగడచినచో ౯౦ వర్షములు ఆయుర్దాయము, పూర్వశాపమువలన కలియుగములో తదర్ధమగును. భాద్రపద శు ౧౨ శనివారం శరీరవ్యాధిచేమరణము, శనియుండిన ఆయుపులేకనే పుట్టిచచ్చిపోవును, రవివలన ధనవంతుడు, చంద్రునివలన స్థిరత్వము, బుధునివలన స్త్రీవశవర్తి, నానా స్త్రీ సంపర్కము, గురువువలననేత్రరోగి, పూర్వము పెద్దలాశీర్వచనమును సంపాదించినవాడుగాన మహాధనవంతుడై యుండును.

శ్లో॥ పూర్వభాద్రపాదం ఉత్తరాభాద్ర రేవత్యంతం మీనమ్॥ అధిపతి గురుడు, రూపసి, ధనస్వభావి, దేవతాదర్శనప్రియుడు, అన్నదానపరుడు, ధర్మపరుడు, తటాకాదిపుణ్యక్షేత్రాదిప్రతిష్ఠాపరుడు, పితృమాతృభక్తిపరుడు, పత్నీ దూషకుడు, ౮ సం॥ శిశుగండము, ౧౨ మృత్యుగండము. ౨౨ అపమృత్యుభయం అన్నియు అదృష్టమువలన తప్పిపోవును ౮౦ సం॥ ఆయుర్దాయము. ఉత్తరజన్మలో మహాపుణ్యశాలిగ పుట్టును గ్రహములుఅన్నియు మంచివిగానుండును.

సమాప్తము.

